60th Year of Publication వజ్రోత్సవ సంవత్సరం

# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు

మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి

ESTD. 1930
Regd No. H. NL. 18
సంపుటి: 60 సంచిక: 11
17-3-1989
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూ 1.50

# తీవ్రమవుతుందా? తుస్సుమంటుందా?

నడిచిన రాజకీయ మత్తగజాలలాగా పార్టీ నత్త్వంపై విరుచుకుపడుతున్న ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావుకు, మాజీ మంత్రిత్రయం అంకుశం మాదిరి తయారుకాగలదన్న ఆశ నిరాశే అయింది. వీరు ముగ్గురూ అసమ్మతివాద ఉద్యమం మొదలుపెట్టి నెలదాటింది. అసెంబ్లీ సమావేశాలు జరుగుతున్న సమయంలో, శాసన సభ ఎన్నికలకు గడువు దగ్గరపడుతున్న తరుణంలో పార్టీలో విస్తృతమైన పలుకుబడి కల్గిన మూడు ప్రాంతాల సీనియర్ నాయకులు అలక ప్రారంభించడంతో, పరిణామాలు తీవ్రంగావుంటాయని అందరూ ఆశించారు. నాయకత్వంపై కినుక వుండీ, నోరుతెరవడానికి సాహసించలేని శాసనసభ్యులు పలువురు. కాగలకార్యాన్ని చేయబోతున్న గంధర్వులవలె భావించి మాజీ మంత్రిత్రయాన్ని ఆరాధించారు. అయితే అసెంబ్లీ సమావేశాలు చివరిదశకు వచ్చినప్పటికీ అసమ్మతివాదుల కార్యక్రమాలు వేగం అందుకోలేదు సరికదా. దినదినానికీ చప్పబడిపోతున్నాయి. దాదాపు వంద మంది ఎమ్మెల్యేలు తమకు మద్దతునిస్తారనే నమ్మకంతో వుండినారు అసమ్మతివాదులు. ఆ ధైర్యంతోనే వారు లెజిస్లేచర్ సమావేశానికి రిక్విజిషన్ నోటీసు ఇవ్వాలని సంకల్పించారు. కాని వందమందికాదుకదా - ఒక్కరు సైతం ఇప్పటివరకు బహిరంగంగా వీరితో చేతులు కల్పడానికి సాహసించడంలేదు. తెరవెనుక, రహస్యంగా కలిసి మాట్లాడడం తప్ప నేరుగా బయటపడడం వీరి వశం కావడం లేదు. సంతకాల సేకరణ మాటల రూపం నుండి, చేతల రూపానికి మారకపోవడానికి ఇదే కారణం.

అసమ్మతివాదం పట్ల తెలుగుదేశం పార్టీలో నెలకొన్న భయాలు కూడా క్రమంగా ఉపశమించాయి. మొదట్లో మాజీ మంత్రిత్రయానికి శాసనసభ్యులలోవున్న పలుకుబడి దృష్ట్యా, వారి తిరుగుబాటు ప్రభావం పార్టీపై ఎంతో వుంటుందని ఆందోళన చెందారు. అందువల్లే చంద్రబాబునాయుడు, ఉపేంద్ర తదితర నాయకులు వారిని శాంతింప చేయడానికి ప్రయత్నించారు. తమతమ జిల్లాలలో అపారమైన అనుచరవర్గం వున్న ఈ మంత్రులు దూరమైతే, ఎన్నికలలో పార్టీ యంత్రాంగం బలహీన పడుతుందన్నది అందరి భయం. డాక్టర్ వెంకటేశ్వరరావు మాత్రం ఈ భయాలను మొదట్నుంచీ త్రోసిపుచ్చుతూ వచ్చారు. అసమ్మతి అనేపదం ఉచ్చరించే వారిని పార్టీనుండి బయటకు నెట్టివేయాలనే పట్టుదల ఆయనది. దీనికి తగినట్లే ఎన్. టి. రామారావుకూడా వీరిని గడ్డిపోచం క్రింద జమకట్టాడు. ఎందరు ఎన్నివిధాల నచ్చచెప్పినా ఆయన వారితో మాట్లాడడానికి ఇష్టపడలేదు. 14 తేది ఉదయం వసంత నాగేశ్వరరావు తనని కల్సి ఇచ్చిన లేఖనుకూడా ఆయన సీరియస్‌గా తీసుకోలేదు. పార్టీ ప్రధాన కార్యదర్శి అశోక్ గజపతిరాజు చేతికిచ్చి, నాదారం సెట్టింగుల పర్యవేక్షణకు వెళ్ళిపోయారు. లెజిస్లేచర్ పార్టీ సమావేశం ఏర్పాటుచేసే ప్రశ్నే లేదు పొమ్మంటున్నారు. అసెంబ్లీ ఎన్నికలలో ప్రస్తుత ఎమ్మెల్యేలకు తిరిగి టిక్కెట్లిస్తామనే హామీ ఇవ్వనుగాక ఇవ్వనని చెప్పేశాడు.

ప్రజలలో పార్టీ చులకనై పోతున్నదని చంద్రబాబునాయుడు రంగంలోకి దిగి మాజీమంత్రులందరినీ ఒకచోట కూరేసి ప్రకటన ఇప్పించారు తప్ప, ఎన్. టి. రామారావు నుంచి మాత్రం వీరి ప్రస్తావన ఏ రూపంగానూ రావడంలేదు.

ఈ పరిస్థితులలో అసమ్మతి వాదం తుస్సుమనిపోతుందా లేక తీవ్రతరమౌతుందా అన్న విషయం తేలడంలేదు. మాజీ మంత్రులు ముగ్గురుమాత్రం తమ కోర్కెలు నెరవేరకుండా అధిష్ఠానవర్గంలో రాజీపడే ప్రశ్నే లేదన్న పంతంలో వున్నారు.

—తరువాయి 7 వ పేజీలో

## కాంగ్రెస్ కుమ్ము ఇంకా చల్లారలేదా?

# జమీన్‌రైతు

## ప్రతిపక్షాల వైఖరి

మనదేశంలో ప్రతిపక్షాల వైఖరి రోజురోజుకు అనుచితంగా, విషపూరితంగా, విపరీతంగా పరిణమిస్తున్నది. సమస్యను సమస్యగా కాకుండా, ప్రతిసమస్యను పార్టీగా కాంగ్రెస్‌కు, వ్యక్తిగా రాజీవ్ గాంధీకి ఎత్తిపెట్టి, కుమ్మెత్తడం, బురదచల్లడం, అప్రతిష్టపాలు గావించడానికి వినియోగించుకొంటున్నారు. ప్రతిసమస్యను రాజకీయం జేసి, రభససృష్టించి, ప్రయోజనాన్ని పొందజూడడం మాత్రం దేశహితం, ప్రజాహితం కాబోదు.

మొన్నటివరకు బోఫోర్స్‌తో కాలక్షేపం చేశాయి కాంగ్రెస్ ప్రతిపక్షాలు. విశ్వాసఘాతుకంగా ప్రధాని రాజీవ్‌గాంధీని వెన్నుపోటు పొడవడానికి పూనుకున్న స్వజనంతో చేతులుకలిపి, ప్రధానిని రాజకీయంగా ఖూనీచేయడానికి, కాంగ్రెస్‌ను ఖననంగావించడానికి ఎంతో నీచానికి దిగజారి పతనమై దేశగౌరవమే మంటగలిసేటట్లు ప్రవర్తించాయి ప్రతిపక్షాలు. రాము ఆవివీటిమీద సమరంసాగించి, నీతిని ప్రతిష్ఠించేవీరులుగా ప్రతిపక్షనాయకులు ఆత్మసంతృప్తిని పొందివుండవచ్చుగాని, వీరి ఆల్లరిమూలంగా ప్రపంచదృష్టిలో దేశం ఎంత చిన్నబోయిందో, పార్లమెంటు సమావేశాలు ఎంతగందరగోళానికి గురియయ్యాయో, ఇటువంటి పరిణామాలు కార్యకలాపాలపట్ల ఎంతగా రాజకీయ అస్థిరత నెలకొంటున్నదో గ్రహించలేకున్నారు.

బోఫోర్స్‌సమస్యను ప్రధాని రాజీవ్‌గాంధీని మనసులోవుంచుకొని రభససృష్టిస్తే, తాజాగా ఆర్. కె. ధవాన్‌ను దృష్టిలోవుంచుకొని ఠక్కర్ కమిషన్ రిపోర్టుసాకుగా గందరగోళం సృష్టించడానికి పూనుకున్నారు. రాజకీయ పరిజ్ఞానంవున్న ప్రతిఒక్కరికీ ధవాన్ అందరికీ ఎవరైంది తెలుసు. శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధానిగా వుండిన పదకొండు సంవత్సరాలు ఆమె ఆంతరంగిక కార్యదర్శిగా, ఆమెకు అత్యంత విశ్వాసపాత్రుడుగా, ఆమె కష్టసుఖాల్లో భాగస్తుడై భారత రాజకీయాలలో తెరమరుగున వుండి మితిమీరిన అధికారాన్ని చెలాయించి, అత్యంత పలుకుబడి సంపాదించుకున్నవ్యక్తి. ఇందిరాగాంధీ హత్యానంతరం అనుమానాస్పదుడైన వ్యక్తిగా ప్రధాని రాజీవ్‌గాంధీ చేత దూరంగావుంచబడి, నాలుగేళ్ళపాటు పోలీస్ నిఘాలో ఏకాకిగా అజ్ఞాతవాసం గడిపినవ్యక్తి. ఆసమయంలో రాజీవ్‌గాంధీ ప్రత్యర్థులు, ఇందిరాగాంధీకి సంబంధించి వ్యక్తిగతంగాను, రాజకీయంగాను లోతుపాతులు సర్వస్వం తెలిసినవాడు కాబట్టి ధవాన్‌ను రాజీవ్‌కు, కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా వుపయోగపెట్టుకోడానికి తమవైపుకు త్రిప్పుకోవాలని విశ్వప్రయత్నం చేశారు. ఆటువంటివారిలో ప్రధాని అయిన తాలిరోజులలో అత్యంత నమ్మకంవుంచిన అరుణ్ నెహ్రూ ఒకరు. కాని ధవాన్ మాత్రం రాజీవ్‌చేత అవమానింపబడినా, ఆయనకు అపకారం తలపెట్టక, ఒత్తిడులు, ప్రలోభాలు నిగ్రహించుకొని, నిశ్చలంగా నిబ్బరంగా వుండిపోయారు. అతని విశ్వాసపాత్రతనుగుర్తించే కాబోలు ప్రధాని రాజీవ్‌గాంధీ ధవాన్‌ను తిరుగా పూర్వస్థానంలో నియమించుకున్నారు. ధవాన్ మరలా వెలుగులోకిరావడం, ప్రధాని కార్యాలయంలో కీలకమైనస్థానంలో పునఃప్రతిష్ఠితంకావడం సహజంగానే ప్రతిపక్షీయులలోనేగాక, కొందరు కాంగ్రెస్ ముఖ్యులలో కూడా కలవరం తత్తరపాటుకల్గించివుండవచ్చు. దానిపర్యవసానమే ఠక్కర్ కమిటీ రిపోర్టు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలో వెల్లడికావడం, ఆ రిపోర్టును పార్లమెంటు ముందు వుంచాలని సభ్యులు పట్టుబట్టడం, 88 మంది పార్లమెంటుసభ్యులు ఒకవారంపాటు సస్పెండ్‌చేయబడిన అసాధారణచర్య!

ఇందిరాగాంధీ హత్యతో ఆర్. కె. ధవాన్‌కు సంబంధం వున్నదనే అంశం ఠక్కర్ రిపోర్టులో వున్నదని, అందువల్ల దాన్ని బహిరంగపర్చవలసిందిగా ప్రతిపక్షసభ్యులకోర్కె. అది రహస్యనివేదిక; దాన్ని బహిరంగపరచకూడదని పార్లమెంటే చట్టంచేసింది. అటువంటిదాన్ని పార్లమెంటు ముందు వుంచమని పట్టుబట్టడమంటే, క్రొత్తగొడవ సృష్టించడంకాదా? దానినంగతి పోనివ్వండి; దాదాపు ఇరవైఏళ్ళపాటు ఇందిరాగాంధీకి అత్యంతవిశ్వాసపాత్రంగా సేవచేసినవ్యక్తిని అనుమానించడం ఎంతవరకుసమంజసం? తనతల్లి హత్యతో సంబంధం వున్నవ్యక్తిని ప్రధాని కీలకమైన పదవిలోకి తీసుకుంటాడా? ఇందిరాగాంధీపట్ల అనయుడికిలేని ప్రేమానురాగాలు, ఆమె వినాశాన్ని కోరిన ప్రతిపక్షాలకు వుంటాయనుకోగలమా? ధవాన్‌మీద ధ్వజమెత్తడానికి తప్ప, ఠక్కర్ రిపోర్టుమీద హఠాత్తుగా ప్రతిపక్షాలకు ఎందుకు ఇంతటి శ్రద్ధాసక్తులు కలిగాయి? ధవాన్ పునర్ నియామకం, ఠక్కర్ రిపోర్టు వెల్లడి- అంతరంగంలో ఏదో రాజకీయదురుద్దేశ్యం, కుట్ర ఇమిడి వున్నాయనుకోవడం పొరపాటవుతుందా?

# కరెంటు లేకుండా రాష్ట్రాన్ని చీకట్లో ముంచడం అభివృద్ధా?

89.90 సంవత్సరానికి మన రాష్ట్ర ప్రభుత్వం తయారుచేసినబడ్జెట్ స్వరూపం చూస్తుంటే తెలుగుదేశం ప్రభుత్వం గతం నుండి ఎలాంటి గుణపాఠం నేర్చుకున్నట్లు కన్పించడంలేదు. సంక్షేమ పథకాలపేరుతో జనాకర్షణ పథకాలను ప్రవేశపెట్టి, వీటికే ఎక్కువ ప్రాముఖ్యతయిచ్చి రాష్ట్రాన్ని అభివృద్ధి పరచేందుకు స్వస్తి పల్కుతున్నట్లుగా వుంది.

మన రాష్ట్రం ముఖ్యంగా వ్యవసాయానికే ఎక్కువగా ప్రాధాన్యత కల్గివుంది. అన్నిపంటలనూ కరెంటుమోటార్ల సహాయంతో నీటిని వుపయోగించి పండిస్తున్నారు. కాబట్టి వ్యవసాయరంగం విద్యుచ్ఛక్తిపై ఎక్కువగా ఆధారపడివుంది. అలాగే అభివృద్ధికి ప్రతిరూపాలు పరిశ్రమలు. ఇతర రాష్ట్రాలతో పోల్చుకుంటే పారిశ్రామికంగా ప్రస్తుతం మనం చాలా వెనుకబడి వున్నామనే చెప్పాలి. క్రొత్తగా పరిశ్రమలుస్థాపించేందుకు ఎవరూముందుకు రావడంలేదు. ఇపుడున్న పరిశ్రమలే తగినంత కరెంటులేక మూతబడిపోతున్నాయి. అందువల్ల నిరుద్యోగ సమస్యకూడా వుత్పన్నమవుతుంది.

ఈపరిస్థితుల్లో మొట్టమొదటగా విద్యుత్ రంగానికే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాల్సివుంది. కాని దాని ప్రాధాన్యతను గమనించకుండా విద్యుత్‌రంగంపై నిర్లక్ష్యం చేయడం ఒకరకంగా రాష్ట్రాన్ని దిగజార్చడమే అవుతుంది. దీనికి అతి చిన్నమొత్తంలో కేవలం 17 కోట్లు మాత్రమే కేటాయించడం మహా దారుణమైనవిషయం.

రామనపాళెం -వి. వెంకట్రామిరెడ్డి




### నేను అధ్యక్షుడైంది నెల్లూరు రీజియన్‌కే!

జనవాణి శీర్షికన మార్చి 10 తేది సంచికలో నెల్లూరు రీజియన్ చేర్మెనా? నెల్లూరికే చేర్మెనా? అని నన్నుగూర్చి ఒక ఆర్.టి.సి ఉద్యోగి పేరుతో వ్రాసిన విషయం చదివి ఆశ్చర్యపోయాను. 27 డిపోలు, 4డివిజన్లు కలిగియున్న ఈ రీజియను ముఖ్యకేంద్రం నెల్లూరే. ఆటువంటి హెడ్ ఆఫీసు వుండు నేను వుండడంలో తప్పేమిటో నాకేమీటోచడంలేదు. ప్రతి రీజియన్‌లో రీజినల్ చేర్మెన్‌కు ఒక ప్రత్యేకగది నిర్మించమని ఇటీవలజరిగిన బోర్డుమీటింగ్‌లో నిర్ణయించబడినప్పటికీ, నేను అలాచేస్తే దబ్బువృధా అవుతుందని భావించి, వున్నగదులలోనే సర్దుకొంటున్నాము.

నేను బసచేసే రూముకు రోజుకు 10 రూపాయలుమాత్రమే ఖర్చుఅవుతుంది. నేను నెలకొకసారికూడా ఇక్కడికి రావడం లేదు. నా మకాంకోసం కొన్నివేల రూపాయలు ఖర్చుఅవుతుందని చెప్పడం అతిశయోక్తేకాని మరొకటికాదు. నా గురించి ఎంత ఖర్చుఅవుతుందో ఈ రీజియన్‌లో అడిగి తెలుసుకోవచ్చు. నాకోసం ఆర్టీసీ కార్లఖర్చుకూడా ఎక్కువవుతుందన్నారు. రీజినల్ చేర్మెన్‌గా అధికారహోదాతో ఇచటికి రాదలచుకున్నా, కార్లోనేరావచ్చు. కాని నేను బస్సుల్లోనే ఎక్కువగా ప్రయా

—కారవ 7 వ పేజీలో

### 1939 లో ఈవారం పత్రిక లేదు

17-3-1939 తేది వెలువడవలసిన సంచిక అదినం వెలువడలేదు. అందువల్ల '50 ఏళ్ళ క్రితం ఈవారం' శీర్షిక ఇవ్వలేకపోతున్నాము. -సం.

## గూడూరు సబార్డినేట్ జడ్జి కోర్టులో

E. P. No. 27/87 N. O. S. No. 116/76

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా వెంకటగిరి డి. హో.

Vs.

లాలాపేట క్రిష్ణయ్య జె. డి. ఆర్.

### ప్రకటన

ఈ క్రింద నమూదైన షెడ్యూలు దాఖలా స్థిరాస్థిని పై కోర్టుకో 11-4-89 తేది ఉదయం 10-30 గంIకు బహిరంగవేలం జరుపబడును. పాడదలచినవారు పాడుకొనవచ్చునని. ఇందుమూలకముగా యావన్మందికి తెలియచేయడమైనది.

### ఆస్థి షెడ్యూలు

నెల్లూరు జిల్లా వెంకటగిరి మండలం, బొమ్మగుంట గ్రామ పొంములో జెడికి హక్కుగల ఆస్థి వివరం :-

| పట్టా నం. | సర్వే నం. | విస్తీర్ణం | హెక్టార్లు | డి. హో. విలువ | అపీనా విలువ |
|---|---|---|---|---|---|
| 5 | 17/4 | 0.11 | 0.045 | రు. 550/- | రు. 330/- |
| 41 | 17/7 | 0.75 | 0.303 | 3750/- | 2250/- |
| 66 | 17/5 | 0.18 | 0.073 | 900/- | 580/- |
| ,, | 17/6 | 0.22 | 0.089 | 1100/- | 660/- |
| ,, | 18/6 | 0.05 | 0.020 | 250/- | 150/- |
| ,, | 18/7 | 0.13 | 0.052 | 650/- | 350/- |
| ,, | 18/8 | 0.21 | 0.085 | 1050/- | 630/- |
| ,, | 18/9 | 0.12 | 0.049 | 600/- | 360/- |
| ,, | 18/10 | 0.19 | 0.077 | 900/- | 690/- |
| 58 | 17/8 | 0.51 | 0.266 | 2500/- | 1528/- |
| | | 2.47 | | | |

నెల్లూరు డి॥ వెంకటగిరి మండలం పెట్లూరు గ్రామ పొంముకో జెడికి హక్కుగల ఆస్థి వివరం :-

| పట్టా నం. | సర్వే నం. | విస్తీర్ణం | హెక్టార్లు | డి. హో. విలువ | అపీనా విలువ |
|---|---|---|---|---|---|
| 28 | 89/4 | 0.03 | 0.012 | రు. 150/- | రు. 360/- |
| ,, | 89/2 | 0.09 | 0.036 | 450/- | 270/- |
| ,, | 73/5 | 0.32 | 0.129 | 1600/- | 960/- |
| ,, | 72/9 | 0.34 | 0.137 | 1700/- | 1030/- |
| ,, | 73/11 | 0.17 | 0.069 | 850/- | 510/- |
| ,, | 78/13 | 0.30 | 0.121 | 1500/- | 900/- |
| ,, | 57/6 | 0.52 | 0.210 | 2600/- | 1560/- |
| ,, | 47/1 | 0.13 | 0.049 | 600/- | 360/- |
| ,, | 34/4 | 0.73 | 0.295 | 3650/- | 2190/- |

-వి. రామదాసు

డి. హో. అడ్వకేటు

# నెల్లూరు చుట్టుపట్ల
## విమర్శకుడు

### సునీల్ కుమార్ కరువు పర్యటన

రాష్ట్ర పునరావాస, సహాయ కమీషనర్ శ్రీ సునీల్‌కుమార్ కరువుపరిస్థితులు పరిశీలించడానికోసం 13, 14 తేదీలలో జిల్లాలో పర్యటించారు. పొదలకూరు, కలిచేడు, సైదాపురం, రాపూరు, డక్కిలి, వెంకటగిరి, పెళ్ళకూరు, నాయుడుపేట, ఓజిలి, చిల్లకూరు, కడివేడు, చిరమన, కలిగిరి, వింజమూరు, దుత్తలూరు, ఉదయగిరి, గండిపాళెం, ఆత్మకూరు తదితర గ్రామాలన్నింటిలోనూ ఆయన విహంగ వీక్షణం చేశారు. రెండంటే రెండురోజులలో, 500 కిలోమీటర్లకు పైబడిన దూరం వాయువేగ మనోవేగాలతో కార్లనుపరుగెత్తించి, అక్కడక్కడా కమీషనర్‌గారిని ఎండలో నిలబెట్టించి, కరువు పరిస్థితిని అనుభవింపజేసి పంపారు జిల్లాఅధికార్లు.

ఈ సునీల్‌గారి పర్యటనలో ఆయన అసంఖ్యాకమైన వినతి పత్రాలు అందుకున్నారు. జి.ప. చేర్మన్, సి పి ఎం పార్టీ, కలెక్టర్‌తోపాటుగా ప్రత్యేక నివేదికలవంటి విజ్ఞప్తి పుస్తకాలు సమర్పించారు. మండలాధ్యక్షులందరూ విడివిడిగా కాగితాలందించారు. సాయంత్రం నెల్లూరు జి ప్రవ ప కార్యాలయంలో సమావేశం జరిగింది.

కమీషనర్‌గారు, హైదరాబాదుకు వెళ్ళిన తర్వాత ప్రభుత్వానికి నివేదిక సమర్పిస్తారట.

1987 నవంబరులో అన్నగారు ఒకసారి జిల్లాలో కరువు పర్యటన చేశారు. ఉదయగిరిసభలో వరాలువెల్లువపారించారు. అయితేఅప్పుడాయనచెప్పిన ట్యూబ్‌వెల్ బోర్లు, ఫిల్టర్ పాయింట్లకే ఇప్పటి వరకు నిధులు రాలేదట. ఇక కమీషనర్ గారు సమర్పించే నివేదికపై ఇంకెన్నేళ్ళకు రాసులు రాలుస్తారోచూడాలి!

### ప్రెస్‌క్లబ్‌కు చందాలా?

నెల్లూరులో ప్రెస్‌క్లబ్ భవనం నిర్మిస్తున్నామని కొందరు 'పెద్ద' పాత్రికేయులే చందాల దందాలో పడ్డారట. డబ్బుతో ప్రమేయమున్నవారు, పనులనూ అమాంతం కానుగోలు చేయగల్గిన ఇద్దరేసి కాక ఉన్నతాధికారి ఒకరు తొలిబోడీగా 85 వేల రూపాయలకు దొంగబిల్లులేసి ఇచ్చాడని వినికిడి! ఇంకెందరి దగ్గర ఈ ముడుపుల స్వీకారం జరిగిందో తెలియదు.

నెల్లూరులో ప్రెస్‌క్లబ్ పనిచేయడం మానేసి చాలాకాలమైపోయింది. ప్రస్తుతం పేరుకు కూడా ఆ సంస్థ లేదు. ఇప్పుడు ప్రెస్‌క్లబ్ పేరుపెట్టి కొందరు చందాలు దండుకుంటూ, స్వంతానికి స్వాహా చేస్తున్నారని ఆరోపణ కలుగుతున్నది. నెల్లూరులో పాత్రికేయులకు అసలే మంచిపేరు లేదు; ఇటువంటి దందాలు జరిగితే వున్న కాస్త పేరు పడిపోతుంది. ఒకరికిచెప్పాల్సిన వాళ్ళం, మనమే తప్పుచేస్తే ఎట్లాగండీ!

### మొల్ల జయంతి

సాహిత్యసదస్సు, 16వతేది సాయంత్రం టౌన్‌హాల్‌లో మొల్ల జయంతి జరిపింది. స్వర్గీయ ఆర్ ఎల్ రెడ్డి ప్రారంభించిన జయంతి ఇది. ఆయన గతించినా, ఆయనపై భక్తితో గోసుకొండ వెంకటసుబ్బయ్యగారు క్రమం తప్పకుండా ఆ ఆనవాయితీని పాటిస్తున్నారు.

ఈసారి సభకు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షించారు. ఛందోబద్ధ పద్య కవిత్వం పెద్దరికం వహిస్తుండిన తెలుగు సాహిత్యంలో, వరవస్తు చిన్నయసూరి వచన కవితా విప్లవంతెస్తే, ఇప్పటి కవి డాక్టర్ సి నారాయణరెడ్డిగారు గేయ కవిత్వానికి ప్రచారరణలో ప్రథమపీట వేయించారని చెప్తూ ఆయన, వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య చరిత్రలో మార్పులను స్థూలంగా సమీక్షించారు.

సర్వోదయ కాలేజి లెక్చరర్ కుమారి ఎం. గిరిజాకుమారి మొల్ల రచనాశైలిపై ప్రసంగించి, సన్మానం స్వీకరించారు. మొల్ల కవిత్వం సామాన్యులకు కూడా అర్థమై, రసానుభూతిని కల్గిస్తుందని అన్నారామె.

ఆర్. ఎల్. రెడ్డి ట్రస్టు చేర్మన్ శ్రీ వేణుగోపాల [illegible] రెడ్డి కుమారి గిరిజను సత్కరించారు. శ్రీ గోసుకొండ వెంకటసుబ్బయ్య స్వాగత వందనాలుచెప్పారు.

### త్యాగరాజ ఉత్సవాలు

త్యాగరాజ ఆరాధనోత్సవాలు 21 నుంచి 27 తేది వరకు టౌన్‌హాల్‌లో జరుగుతాయి. మొదటిరోజు ఎం. శ్రీనివాస్ మాండలిన్ కచేరి తప్ప, పేరున్న విద్వాంసుల కార్యక్రమమేమీ లేదేమిటి!

### ఆర్టీసి సమ్మె

ఎప్పుడో మూడేళ్ళ క్రితమే చేసుకున్న ఒప్పందాలను ఇప్పటికీ అమలు పరచని మేనేజిమెంట్ వైఖరికి నిరసనగా 18వ తేది ఆర్టీసి సమ్మె జరుగుతుందట. నెల్లూరు ఆర్ టి సి ఉద్యోగులందరూ సమ్మెలో పాల్గొనాలనికోరుతున్నారు ఎ ఐ టి యు సి కార్యదర్శి శ్రీ వి. రామరాజు.

### ప్రాణంలేని వార్త

కావలి జవహర్‌భారతిలో ఎవరిమీదనో దౌర్జన్యం జరిగినట్లు, ప్రిన్సిపాలు తదితరులు ఎటువంటిచర్య తీసుకోనట్లు సంతకం లేని తెలుగులో టైపుచేయబడి ఒక కాగితం ఆరోపిస్తున్నది.

టీ టీ కి ప్రాణంబు వ్రాలు అన్నారు. ప్రాణంలేని ఈ వార్తను ధృవపరచుకొని గాని ప్రకటించలేము.

### ఓర్వలేని దేవుడు!

జనోటో కేకలు, దాస్‌ప్రకాష్ ఐస్ క్రీంల తయారీతో యువ పారిశ్రామికవేత్తగా వికసిస్తుండిన శ్రీ వై. హీరారెడ్డి అర్ధాంగి జననిలో మద్రాసులో ఆటోలో పోతుండగా ప్రభుత్వ బస్సుగుద్ది తీవ్రమైన గాయాలకు గురియైంది. ఆమెకు ఇప్పటివరకు స్పృహ రాలేదట. విజయ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నది.

మనిషికంటేఅసూయాపరుడుగా వున్నట్లున్నాడు దేవుడు! లేకుంటే పురోభివృద్ధి పథంలో అడుగుపెట్టిన ఆ యువకుడికి ఈ విపత్తేమిటి? హీరారెడ్డికి శుభసంతోషాలు కలగాలని ఆకాంక్షిస్తాము.

—కొరవ 7 వ పేజీలో

### ఖోఖో క్రీడలో స్వర్ణపతకం

గుంటూరులో ఇటీవల జరిగిన జాతీయ క్రీడల పోటీలలో ఖోఖో ఆటలో అత్యంత ప్రతిభను ప్రదర్శించి స్వర్ణపతకం బహూకృతి పొందిన చిన్నచెరుకూరు హైస్కూలు విద్యార్థిని

**గరికపాటి కామాక్షి**

జిల్లాకు కీర్తితెచ్చిన కామాక్షిని; క్రీడలలో వృత్తిగా శిక్షణనిస్తున్న పి. ఇ. టి. శ్రీ పి. వెంకటేశ్వరరావును అభినందిస్తున్నాము.

# తీవ్రమవుతుందా... (మొదటి పేజీ తరువాయి)

కె. జె. కృష్ణమూర్తి, వసంత నాగేశ్వర రావులిద్దరూ అవసరమైతే పార్టీ నుండి బయటకువెళ్ళిపోవాలనే తెగింపుకు కూడా వచ్చారు. వారి అనుచరులే అంత తెంపు ప్రదర్శించలేకపోతున్నారు. కృష్ణమూర్తి కేమి, ఏ పార్టీలోచేరినా టిక్కెట్ వస్తుంది. వారిని నమ్మి బయటకువెళితే మాకా గ్యారంటీ ఏమిటి? రెంటికీచెడినరేవడి అయిపోమా అని వారు ప్రశ్నిస్తున్నారు.

ఎన్. టి. రామారావు ఎట్టి పరిస్థితుల లోనూ ప్రస్తుత ఎమ్మెల్యేలకు టిక్కెట్లు ఇవ్వరని, అభిమానులు, రాజకీయ అనుభవ జ్ఞులతో ఎన్నికలలో సాహసం చేయ బోతున్నారని, ఈసమయంలోనే ఆయనపై గట్టిగా వత్తిడితెగల్గితే, అందరికీ అవకాశం లభిస్తుందని, అందువల్ల తమతో సహక రించాలని వారు అభ్యర్థిస్తున్నారు.

ఇంకో ప్రక్క సి. పి. ఎం., జనతా, సి. పి. ఐ. వంటి పార్టీలతోకూడా అస మ్మతివాదులు చర్చలు జరుపుతున్నట్లు తెలుస్తున్నది. తాము 100మందివరకు ఎమ్మెల్యేలతో తిరుగుబాటుచేయదిస్తామని, తమకు జనతాదళ్ గుర్తింపు ఇవ్వాలని మాజీ మంత్రిత్రయం ప్రతిపాదించిందట. వంద మందితోవస్తే ఆలోచిస్తామని బాబుల్‌రెడ్డి గారు హామీ ఇచ్చారట. కాంగ్రెస్‌వైపు మాత్రం ఎటువంటి ఉత్సాహం వ్యక్తమైనట్లులేదు.

అసలు కాంగ్రెస్‌పార్టీ పరిస్థితి అయో మయంగా వుంది. పి సి సి కార్యవర్గం విషయమై అధిష్టానవర్గం ఇంకా ఒక నిర్ణయానికి రాలేదు. పార్లమెంట్‌లో తలెత్తిన సమస్యల పరిష్కారానికే వారి కాలమంతా గడిచి పోతున్నది. కేంద్రమంత్రితో సహా పలువురునాయకులు పార్టీ పదవులుపోయినా పర్వాలేదు. పి సి సి లో మార్పు జరిగితీరాలని పట్టుబడుతున్నారు. వారి మూర్ఖపు కోరికను నివారించేవారు లేకుండాపోయారు.

ఈ పరస్పరకుమ్ములాటలతో పార్టీ నవ్వులపాలై పోతున్నది. ఒకవైపు తెలుగుదేశం అంతఃకలహాలతో బజారుపడి ప్రజలలో విలువ, గౌరవం కోల్పోతున్నసమయంలో ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోలేక పోతున్నది కాంగ్రెస్‌పార్టీ. సమైక్య శక్తిగా ప్రజలలోకి చొచ్చుకు పోవలసిన తరుణంలో ముఠా కీచులాటలు, కుమ్ములాటలతో నిర్వీర్యమైపోతున్నది.

పిసిసి కార్యవర్గం విషయంలో ఏర్పడిన అనిశ్చితస్థితివల్ల రాష్ట్రంలో ఎక్కడా కాంగ్రెస్ కార్యక్రమాలు, ఉద్యమాలు జరగడమేలేదు. శాసనసభలోకూడా ప్రభుత్వం తప్పులను వేలెత్తిచూపడంలో, నిలదీయడంలో దారుణంగా వైఫల్యంచెందుతున్నారు. తెలుగుదేశంపార్టీ ప్రతిష్ట మెట్టుమెట్టుగా దిగజారడం వాస్తవమే అయినా, దానితోపాటుగా కాంగ్రెస్‌పార్టీ కూడా పతనమైపోతుండడంతో, రెండింటి మధ్య అంతరం యధాప్రకారం వుండి పోతున్నదని పరిశీలకులు వ్యాఖ్యానిస్తున్నారు. ★





## జనవాణి
(8వ పేజీ తరువాయి)

ఉంచేస్తుంటాను. ఎందుకంటే సాలన్నులు ఎలావుంటాయో తెల్సుకోడానికి వీలుంటుందని.

నేను ఉద్యోగస్తుల విషయాల్లో శ్రద్ధ తీసుకుంటానని అన్నారు. ఆఫీసు అధికార్లు నా సలహాలకోసం ఎదురుచూస్తారేతప్ప, వారిని వత్తిడిచేయవలసిన అవసరం నాకు వుండబోదు. భవిష్యత్తులోకూడా ఏర్పడదు. ఆఫీసర్లు, కార్మికులు అందరూ ఒకే కుటుంబంలాగా కలిసిమెలిసి జీవనంగడపాలని కోరుకుంటాను. ఏదైనా పరిష్కారం కాని సమస్యలకు కార్మికులకు పరిష్కారం చూపేందుకు నా సహాయ సహకారాలు ఎల్లప్పుడూ వుంటాయని తెల్పుతుంటాను. ఇలాసామరస్యభావాన్ని వుద్యోగులందరిలో కల్గజేస్తు, యీ నెల్లూరు రీజియన్‌ను అభివృద్ధికి తెచ్చేందుకు నా శాయశక్తులా కృషి చేస్తున్నాను.

నెల్లూరు — డి. బత్తిరెడ్డి.
చేర్మెన్, రీజనల్ అడ్వయిజరీ కమిటీ,
విక్రమసింహపురం.

(6వ పేజీ తరువాయి)

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు (పాతవి) పుట్టి | | 2900.00 |
| ,, (క్రొత్తవి) | | 1750.00 |
| ఐ. ఆర్. 20 (పాతవి) | | 2400.00 |
| ,, (కొత్తవి) | | 1750.00 |
| మొలగొలుకు బియ్యం | | |
| (పాతవి) | (70 కి) | 410.00 |
| ,, (కొత్తవి) | ,, | 260.00 |

## కావలి ప్రి॥ డి॥ ము॥ కోర్టులో

E. P. No. 88/86

O. S. No. 743/81

యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా
నెల్లూరు -డి. హో. /వాది

Vs.

కరణం వెంకటేశ్వర్లు
-జెడిఆర్/ప్రతివాది

షెడ్యూలు ఆస్తిని పై కోర్టులో 28-3-89 తేదీ వేలం వేయుదురు. కావున కావలసినవారు పాడుకోవచ్చును.

షెడ్యూలు: నెల్లూరు రి॥ డి॥ కావలి సబ్ అనంతపురం గ్రామములో జెడిఆర్ కు హక్కు, అనుభవం గల ఆస్తి

పట్టా నం. 319 సర్వే నం. 96/1 విస్తీర్ణం ఎ 1-92, హె॥ 0.775, మెట్ట, డి. హో. విలువ రు. 950/-
అమీనా విలువ రు. 1500/-

పట్టా నం. 319, సర్వే నం. 96/8, విస్తీర్ణం ఎ 1-24, హె॥ 0.501, మెట్ట, డి. హో. విలువ రు. 620/-
అమీనా విలువ రు. 1000/-

పట్టా నం. 47, సర్వే నం. 417/4, విస్తీర్ణం ఎ 1-23, హె॥ 0.498, మెట్ట, డి. హో. విలువ రు. 615/-
అమీనా విలువ రు. 1000/-

పట్టా నం. 7, సర్వే నం. 264/2, విస్తీర్ణం ఎ 8-81, హె॥ 3.869, మెట్ట, డి. హో. విలువ రు. 4880/-
అమీనా విలువ రు. 6600/-

-పి. కోటేశ్వరరావు
డి. హో. అడ్వకేటు

## కావలి డి॥ ము॥ కోర్టులో

E. P. No. 381/88

O. S. No. 322/84

Indian over seas Bank
Bogole Represented by
its Branch manager -DHR
1) కొండేటి వెంకట సుబ్బయ్య -J D R

పైనెంబరు దావాలో ప్రతివాదికి నోటీసు నిమిత్తం 28-4-89 తేదికి వాయిదా వేయబడియున్నది కావున అదినం10-30 గంటలకు రెస్పాండెంటు స్వయముగాగాని, వకీలు ద్వారాగాని హాజరయి తన ఆక్షేపణలు తెలుపుకోవలసినది. లేనియెడల యక్స్ పార్టీగా తీర్మానించబడును.

-టి. దశరథరామయ్య, అడ్వకేటు.

## కావలి డి॥ ము॥ కోర్టులో

E. P. 382/84

O. S. 461/84

Indian Overseas Bank
Bogole, represented by its
Branch Manager -D.H.R.

Vs

2. పుల్లా గోవిందరాజు -జడ్జిమెంటు డెటరు

పైనెంబరుదావాలో ప్రతివాదికి నోటీసు నిమిత్తం 28-4-89 తేదికి వాయిదా వేయబడియున్నది. కావున ఆదినం10-30గంటలకు రెస్పాండెంటు స్వయముగ గాని, వకీలు ద్వారాగాని హాజరయి తన ఆక్షేపణలు తెలుపుకోవలసినది. లేని యెడల యక్స్ పార్టీగా తీర్మానించబడును.

-టి. దశరథరామయ్య, అడ్వకేటు

## నంద్యాల సబ్ జడ్జికోర్టులో

E. P. No. 30/88 In

O. S. No 113/83

ఆంధ్రబ్యాంకు, బనగానిపల్లె -డి. హో.
చిరిగేపల్లె చిన్నపుల్లన్న వగైరా
-జె. డి. లు

పైనెంబరులో జె.డి. 1 వారలకు క్రింది షెడ్యూలు దాఖలా ఆస్తిని పైకోర్టువారి ఎదుట 17-4-89 తేది ఉదయం 10-30 గంటలు నుండి సాయంకాలం 5-00 గంటల వరకు బహిరంగముగ వేలము వేయుదురు. కావున సవాలుదార్లు ఎవరైననువచ్చి సదరు సవాలులో పాల్గొనవచ్చును.

షెడ్యూలు

బనగానపల్లె సబ్ డి లో చేరిన వసువుల గ్రామము పొలములోని జె, డి.1 వారలకు భూమికి నంబరువారి వివరం సర్వేనెం. 879 విస్తీర్ణం యు 5-00 లు 2.028 హెక్టార్లు. తూ) చిరిగేపల్లె పెద్దపుల్లన్నభూమి, ప) ఆర్రెరు నది, ఉ) గొల్లసుంకన్నభూమి, ద) ఆర్రెరు నది.

-యం. బలరామిరెడ్డి, డి.హో. అడ్వకేటు

## నంద్యాల సబ్ జడ్జి కోర్టులో

E. P. No. 32/88 In

O. S. No. 27/85

ఆంధ్రా బ్యాంకు-బనగానిపల్లి -డి. హో.

Vs.

షెచ్. మునీర్‌పుత్రేజా వగైరా -జె.డి.అర్.

పై నంబరులు జెడి 1 వారలకు క్రింది షెడ్యూలు దాఖలా ఆస్తిని పై కోర్టువారి ఎదుట 17-4-89 తేది ఉ॥ 10-30 గం॥ నుండి సాయం కాలము 5 గం॥ లోపల బహిరంగముగ వేలం వేయుదురు. కావున సవాలుదార్లు ఎవరైనను వచ్చి సదరు సవాలులో పాల్గొనవచ్చును.

షెడ్యూలు : బనగానిపల్లి సబ్॥డి॥లో చేరిన జానుముక్కల గ్రామ పొలములోని జెడి 1 వారలకు భూమికి నంబరువారి వివరము.

1) స. నం. 24 పూర్తి, వి స్తీర్ణము య 12-28 లు, హె॥ 4-969, శిస్తు 18-44, చేనిపేరు మదనేను alias వరిజాగ, 2) బనగానిపల్లి సబ్॥ డి॥ లో చేరిన బనగానిపల్లి గ్రామములోని జె డి1 వారలకు ఇంటికి చెక్కుబందివారి వివరం.

తూ॥ సర్కారు రోడ్డు, ప॥ మున్షి జావర్‌పుత్రేజా ఇల్లు, ఉ॥ ప్రతివాది బయలు స్థలం, ద॥ రోడ్డు.

ఈ దిశలకు లోనైన తూ॥ ప॥ 45 గ. (41-14 మీ॥), ఉ॥ ద॥ 50 గ॥ (45-72 మీటర్లు) గల దక్షిణము దిశల వాకిలి గల ఇల్లు ఇంటి నంబరు 2/117 అసెస్‌మెంటు నంబరు 475.

-యం. బలరామిరెడ్డి, డి. హో. అడ్వకేటు

## కావలి సబ్ జడ్జి కోర్టులో

S. C. No. 64/88

మద్దు కొండయ్య -వాది

Vs.

సయ్యద్ సుల్తాన్ సాహెబ్ -ప్రతివాది
సయ్యద్ సుల్తాన్‌సాహెబ్
S/O. కాసిం సాహెబ్, సాకిన్
పెద్దపవని, కందుకూరు తాలూకా
ప్రకాశం జిల్లా -అనువాదికి

ఈ నంబరున వాది మీపైన దావా పెట్టియున్నందుకు మీకు నోటీసు నిమిత్తం 31-3-89 తేదికి వాయిదా వేయబడినది. ఇందు విషయమై మీకు గల ఆక్షేపణలు అదినము ప గ లు 10.30 గంటలకు పైకోర్టులో హాజరయి తెలుపుకోవలెను. లేని యెడల మీపరోక్షమందు యక్స్ పార్టీగా తీర్మానించబడునని ఇందు వల్ల రూఢిగా తెలియజేయడమైనది.

-పి. రామకృష్ణరాజు, అడ్వకేటు

# జిల్లావార్తలు

(6వ పేజీ కొరవ)

### గూడూరు పోస్టల్ ఉద్యోగుల సభలు

గూడూరు పోస్టల్ ఎంప్లాయిస్ యూనియన్ 3 వ తరగతి ఉద్యోగుల సంఘం వార్షిక రాష్ట్ర మహాసభలు 24, 25, 26 తేదులలో గూడూరు టి. టి. డి. కళ్యాణ మండపంలో జరుగుతాయి. ఈ సభలందు ఇ.డి. ఉద్యోగుల సమస్యలు చర్చించడానికి 24 తేదిన ప్రత్యేకసదస్సుకూడా నిర్వహిస్తారట. డాక్టర్ ప్రభాకరరెడ్డి అధ్యక్షతన ఈ సభలు నిర్వహించబడుతాయని ఆర్గనైజింగ్ సెక్రెటరి శ్రీ శివరామకృష్ణయ్య తెలియజేస్తున్నారు.

### ప్రిన్సిపాల్ మరణం

కావలియందు, ఆత్మకూరు ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ చుండిసేతు మాధవరావు కళాశాల పనిమీద హైదరాబాదువెళ్ళి గతనెల 19 తేది హఠాత్తుగా గుండె పోటు రావడంతో అక్కడే మరణించారు. ఆయన భౌతికకాయానికి 20 తేది కావలిలో అంత్యక్రియలు జరిగాయి. ఆయన ఈ సంవత్సరం జూలై ఆఖరుకు సర్వీసు నుండి రిటైర్డు కావలసి వుండగా ఇంతలోనే ఆకస్మిక మరణం సంభవించింది. ఆయనకు భార్య, ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కుమారులు ఉన్నారు.

### వింజమూరు వార్షికోత్సవం

వింజమూరు వై. ఆర్. జూనియర్ కళాశాల వార్షికోత్సవ వేడుకలు 11 తేది జరిగాయి. ఈ కార్యక్రమానికి కళాశాల స్థాపకులు శ్రీ ఏల్చూరు రంగనాథం అధ్యక్షతవహించారు. నర్రవాడ కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ బాలం బ్రహ్మారావు ఉపన్యాసకులుగా పాల్గొన్నారు. శ్రీ సుంకర హనుమంతరావు బహుమతిప్రదానం చేశారు. ఉన్నత పాఠశాల ఉపాధ్యాయుడు శ్రీ సి. హెచ్. రామారావు పర్యవేక్షణలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలు ప్రేక్షకుల నలరింపజేశాయి.

### అధ్వాన్నంగాఉన్న ఆత్మకూరు రోడ్లు

మేజర్ పంచాయతీ అయిన ఆత్మకూరు పంచాయతీ పరిధిలో వున్న రోడ్లన్నీ పూర్తిగా అధ్వాన్న స్థితిలోవున్నాయి. సుమారు ఎనభై వేలకుపైగా జనాభా కల్గివున్న ఆత్మకూరు పంచాయతీలోగల రోడ్లన్నీ గుంటలమయమై పాడుపడిపోయి వుంటున్నాయి. రోడ్డు మీద నడవాలంటే ప్రజలకు ప్రాణసంకటంగా వుంటున్నది. సంవత్సరానికి నాలుగులక్షల రూపాయలకు పైగా ఆదాయం లభిస్తున్న ఈ పంచాయతీకు కనీస వసతిసౌకర్యాలు కూడా పంచాయతీ అధికారులు ఏర్పాటు చేయడం లేదని ప్రజలలో అలజడిగావుంది. ఈ విషయంలో పంచాయతీ ప్రభువులు తక్షణ చర్యలు గైకొనగలరని ఆశిస్తాము.

### సాంస్కృతిక పోటీలు

నెల్లూరు ఫ్రెండ్స్ కల్చరల్ అసోసియేషన్ (అఫ్కా) వార్షికోత్సవం సందర్భంగా అల్లూరులో ఏప్రెల్ 16 తేది రాష్ట్రస్థాయిలో ఏక పాత్రాభినయం, సినిమా పాటలు, కవితలపోటీలు నిర్వహిస్తారట. బహుమతులుకూడా వుంటాయట. వివరాలకు సెక్రెటరీ కేరాఫ్ ప్రభావైద్యశాల, అల్లూరు చిరునామాకువ్రాసి తెలుసుకోవచ్చునని శ్రీ అంజనేయరాజు తెలియజేస్తున్నారు.

### వయోజన విద్యాకేంద్రం

కలువాయి మండలం బెస్తపాళెంలో వయోజన విద్యాకేంద్రాన్ని కలువాయి సబ్‌ఇన్‌స్పెక్టర్ శ్రీ అర్. దేవకుమార్ ప్రారంభించారు. ఈ సందర్భంగా ఏర్పాటయిన సభకు కలువాయి సర్పంచ్ శ్రీ సి. హెచ్. సుబ్బరామిరెడ్డి అధ్యక్షత వహించారు. మండల ప్రజాపరిషత్ ప్రాథమిక పాఠశాల హెడ్మాస్టరు శ్రీ బి. సుందరరామిరెడ్డి, సరస్వతి విద్యానికేతన్ ప్రిన్సిపాల్ శ్రీ యు. సి. పెంచలయ్య, వయోజన విద్యా కార్యకర్త శ్రీ ఎన్ చిన్నపురెడ్డి తదితరులు ఇందులో పాల్గొన్నారు.

### మహిళా దినోత్సవం

గూడూరు ఎన్. జి. ఓ. హోంలో అంతర్జాతీయ మహిళా దినోత్సవం 9 తేది జరిగింది. సభకు మహిళా కళాశాల లెక్చరర్ శ్రీమతి లక్ష్మీసుహాసిని అధ్యక్షత వహించారు. ఆమె తన ప్రసంగంలో స్త్రీల సమస్యలను సమగ్రంగా చర్చించి ఒక అవగాహన యివ్వాలని, చిన్నచిన్న సమస్యలను ఎదుర్కొనలేక మరణాన్ని ప్రత్యామ్నాయంగా ఎంచుకొనే యువతను కొంతైనా ఆత్మస్థైర్యాన్ని కల్గించడం తనధ్యేయమని అన్నారు ప్రధాన వక్తగా విచ్చేసిన లాయర్ లక్ష్మీకుమారి నేడు సమాజంలో స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలనుగురించి చర్చించారు.

### కంపసముద్రం హైస్కూల్లో విద్యా వైజ్ఞానిక ప్రదర్శన

మర్రిపాడుమండలంలోని కంపసముద్రం జి ప్ర ప హైస్కూల్లో ఇటీవల రెండు రోజులపాటు విద్యావైజ్ఞానిక ప్రదర్శనలు జరిగాయి, ఈసందర్భంగా ఏర్పాటైనసభకు మర్రిపాడు మండలాధ్యక్షుడు శ్రీ యం వి నారాయణరెడ్డి అధ్యక్షతవహించారు, జిల్లా పంచాయతీ అధికారి శ్రీ డి వెంకటేశ్వర రావు ముఖ్యఅతిథి; హెడ్మాస్టరు శ్రీ బి బాలకోటయ్య అతిథులను స్వాగతించారు, పాఠశాల కమిటీ అధ్యక్షుడు శ్రీ మల్లు నారాయణరెడ్డి మాట్లాడారు.

ఈ ప్రదర్శనను తిలకించడానికి ఉదయగిరి నియోజకవర్గంలోని అన్ని పాఠశాలల నుండి విద్యార్థులుపాల్గొన్నారు. జి ప్ర ప విద్యాశాఖాధికారి శ్రీ యం శ్రీహరిరావు విద్యార్థులకు బహుమతి ప్రదానం చేశారు. పాఠశాల వుపాధ్యాయుడు శ్రీ పి వెంకటేశ్వర్లు వందన సమర్పణ చేశారు

### జంట మంత్రులు

(2 వ పేజీ కొరవ)

రాఘవరెడ్డి, ప్రిన్సిపల్ శ్రీ మోహనరెడ్డి తదితరులంతా మాట్లాడారు.

నెల్లూరులో మెడికల్ కాలేజి స్థాపనకు కృషిచేస్తానని హామీ ఇచ్చారు మంత్రి. వర్షమాటలేనా లేక గట్టి ప్రయత్నంకూడా జరుగుతుందా?

రాత్రికి గూడూరు సన్నపురెడ్డి కృష్ణారెడ్డికాలేజి వార్షికోత్సవం. మంత్రిగారు చాలా జాడుగానే మాట్లాడారిక్కడ.

అందు క్రితం నెల్లూరులో పత్రికల వారి దగ్గరకూడా వేలషారుగా మాట్లాడారు శ్రీ ఆనం రామనారాయణరెడ్డి పదకొండేళ్ల నుంచి మంత్రులుగావున్న ఇద్దరు నాయకులు జిల్లాకు రావలసి మరొక మంత్రిని రానివ్వకుండా చేశారని. తానుమాత్రం మొత్తం 23 మంది మంత్రులనూ నెల్లూరుకు తీసుకువచ్చి, వారివారి శాఖలలో అభివృద్ధి బాగా జరిగేటట్లు చూస్తానని అన్నారు. అభివృద్ధి అంటే ఆదేమైనా బాయిలమా - మంత్రులు జిల్లాకు వస్తూ వస్తూ తెచ్చి ఇవ్వడానికి!

★

### లుకలుకలు

(2వ పేజీ కొరవ)

పైగా రామనారాయణరెడ్డి తన కేపీ దూరంగా జరిగి వుండకపోవడంతో వారికి తగిన అవకాశమూ లభించడంలేదు.

ఒకరంటే ఒకరికి పడకపోయినా ఎవరెవరు ఏ ఏ మార్గాలతోవున్నది స్పష్టం కాకపోవడంతో నిశ్శబ్దంగా వుండిపోయిన వారంతా పార్టీ సమావేశంలో నోరు విప్పేశారు వై ఎస్ ఆర్, గంగినేని రమణయ్య నాయుడు, నారసింహారెడ్డి, కృష్ణారెడ్డి ఒకరిమీదఒకరు పడి కొట్టుకుంటున్నంత స్పీడులో తిట్టుకోవడం అందరికీ మంచి వినోద కాలక్షేపమే కల్గించింది. ఇప్పుడు ఎవరిపాటికివారు పార్టీ అధిష్ఠాన వర్గానికి ప్రత్యక్షంపై ఫిర్యాదుచేయడానికి రంగం సిద్ధంచేసుకుంటున్నారు. ఎన్టీ ఆర్ కు కావలసిందీ అదే!

★

### సింహపురి శోభ

(4 వ పేజీ కొరవ)

వారు ఎన్ని ఎన్నికలలో ఓట్లేశారో, ఎందరు నాయకులకు తమ దుస్థితిని విన్నవించుకున్నారో, ఎందరు అధికార్ల కాళ్ళకు మొక్కారో లెక్కలేదు. కాని వారి మొర ఆలకించే నాథుడేలేడు.

వారి మొర ఏటిక్కరైనా ఆలకించి వుంటే, పందుల పొర్లాడడానికికూడా వెనుకాడేంత దుర్భరము, దుర్గంధభూయిష్ఠమైన ఆస్థలంలో వారెందుకు జీవనం వెళ్ళదీయవలసివస్తుంది; మునిసిపాలిటీకి వారు మనుషుల క్రింద కన్పించివుంటే, అంతరెత్త వారిమధ్య ఎందుకు క్రుమ్మరిస్తుంది,

(ఫోటో: శ్రీ ఏ. అనంతరామయ్య)

